# అథ త్రయోదశోऽధ్యాయః

# పార్వతీ పరమేశ్వర సంవాదము

భవాన్యువాచ|

కిముక్తం గిరిరాజాయ త్వయా యోగింస్తపస్వినా | తదుత్తరం శృణు విభో మత్తో జ్ఞానవిశారద || 1

తపశ్శక్త్యాన్వితశ్శంభో కరోషి విపులం తపః | తవ బుద్ధిరియం జాతా తపస్తప్తుం మహాత్మనః || 2

సా శక్తిః ప్రకృతిర్ జ్ఞేయా సర్వేషామపి కర్మణామ్ | తయా విరచ్యతే సర్వం పాల్యతే చ వినాశ్యతే || 3

కస్త్వం కా ప్రకృతిస్సూక్ష్మా భగవంస్తద్విమృశ్యతామ్ | వినా ప్రకృత్యా చ కథం లింగరూపీ మహేశ్వరః || 4

అర్చనీయో%సివంద్యో%సి ప్రాణినాం సదా | ప్రకృత్యా చ విచార్యేతి హృదా సర్వం తదుచ్యతామ్ || 5

భవాని ఇట్లు పలికెను-

ఓ యోగీ! తపశ్శాలివగు నీవు పర్వత రాజుతో నెట్టి మాటలను పలికితివి? హే విభో! నీవు జ్ఞానులలో శ్రేష్ఠుడవు. దానికి సమాధానమును నా నుండి వినుము (1). హే శంభో ! నీవు తపశ్శక్తితో కూడియున్నావు. గొప్ప తపస్సును చేయుచున్నావు. మహాత్ముడవగు నీకు ఇట్టి తపస్సును చేయవలెననే బుద్ధి ఉదయించినది (2). కర్మలన్నియు ఆ శక్తి నుండియే పుట్టుచున్నవని యెరుంగుము. ఆమెయే సృష్టినంతనూ రచించి, పాలించి, నశింపజేయుచున్నది (3). నీవెవరు? సూక్ష్మప్రకృతి ఏది? హే భగవాన్! ఈ విషయములను విమర్శించి తెలుసుకొనుము. ప్రకృతి లేకుండగా మహేశ్వరుడు సగుణ రూపధారి ఎట్లు కాగల్గును? (4) ప్రకృతితో కూడి యుండుట

చేతనే నీవు సర్వదా ప్రాణులచే పూజింపబడి, ధ్యానింపబడుచున్నావు. ఈ సత్యమును మనస్సులో నెరింగి, అపుడు నీవు మాటలన్నిటినీ పలుకదగును (5).

బ్రహ్మోవాచ|

పార్వత్యాస్తద్వచశ్శ్రుత్వా మహోతి కరణ    రతః | సువిహస్య ప్రసన్నాత్మా మహేశో వాక్యమబ్రవీత్ || 6

బ్రహ్మ ఇట్లు పలికెను-

గొప్ప లీలను ప్రదర్శించుటలో ప్రీతిగల మహేశ్వరుడు ప్రసన్నమగు అంతఃకరణము గలవాడై, పార్వతి యొక్క ఆ మాటను విని చక్కగా నవ్వి ఇట్లు పలికెను (6).

మహేశ్వర ఉవాచ|

తపసా పరమేణ   వ ప్రకృతిం నాశయామ్యహమ్ | ప్రకృత్యా రహితశ్శంభురహం తిష్ఠామి తత్త్వతః || 7

తస్మాచ్చ ప్రకృతేస్సద్భిర్న కార్యస్సంగ్రహః క్వచిత్ | స్థాతవ్యం నిర్వికారైశ్చ లోకాచారవివర్జితైః || 8

మహేశ్వరుడిట్లు పలికెను-

నేను గొప్ప తపస్సుచే ప్రకృతిని నాశనము చేయుదునా యున్నట్లు చేయుదును. శంభుడనగు నేను ప్రకృతి లేకుండగా ఆత్మస్వరూపుడనై ఉందును (7). కావున సత్పురుషులు ఏ కాలము నందైననూ ప్రకృతిని (స్త్రీని) స్వీకరించరాదు. సత్పురుషులు లోకాచారములను పరత్యజించి వికారము లేనివారై ఉండవలెను (8).

బ్రహ్మోవాచ|

ఇత్యుక్తాశంభునా తాత లౌకిక వ్యవహారతః | సువిహస్య హృదా కాలీ జగాద మధురం వచః | 9

బ్రహ్మ ఇట్లు పలికెను-

వత్సా! శంభుడు లోకపు పోకడనను సరించి ఇట్లు పలుకగా, కాళీదేవి తనలో తాను నవ్వుకొని మధురమగు వచనము నిట్లు పలికెను (9).

కాల్యువాచ |

యదుక్తం భవతా యోగిన్ వచనం శంకర ప్రభో | సా చ కిం ప్రకృతిర్న స్యాదతీతస్త్వాం భవాన్ కథమ్ || 10

ఏతద్విచార్య వక్తవ్యంతత్త్వతో హి యథా తథమ్ | ప్రకృత్యా సర్వమేతచ్చ బద్ధమస్తి నిరంతరమ్ || 11

తస్మాత్త్వయా నవక్తవ్యం న కార్యం కించిదేవ హి | వచనం రచనం సర్వం ప్రాకృతం విద్ధి చేతసా || 12

యచ్ఛృణోషి యదశ్నాసి యత్పశ్యసి కరోషి యత్ | తత్సర్వం ప్రకృతేః కార్యం మిథ్యావాదో నిరర్థకః || 13

కాళీదేవి ఇట్లు పలికెను-

హే శంకరప్రభో! నీవు ప్రకృతిని అతిక్రమించినానని చెప్పితివి. అట్లైనచో, ప్రకృతి స్వరూపురాలగు స్త్రీఏల ఉండరాదు? ఉండకూడదన్నచో, నీవు అతీతుడవని ఎట్లు చెప్పగలము? (10) ఈ విషయమును ఉన్నది ఉన్నట్లుగా తత్త్వ బుద్ధితో విచారించి చెప్పవలెను. ఈ సర్వము సర్వకాలములయందు ప్రకృతి చే బంధింపబడి యున్నది (11). నీవు ప్రకృతి లేనిదే మాటలాడలేవు. ఏ పనినీ చేయలేవు. ఈ జగత్తులోని సర్వవచనములు, సర్వక్రియలు ప్రకృతి నుండి పుట్టినవని నీవు నీ మనస్సులో నిశ్చయించుకొనుము

(12). నీవు ఏది విన్ననూ, ఏది తిన్ననూ, ఏది చూచిననూ, ఏది చేసిననూ ఆ సర్వము ప్రకృతి నుండియే పుట్టును. ప్రకృతిని గురించి మిథ్యావచనములను పలుకుట వ్యర్థము (13).

ప్రకృతేః పరమశ్చేత్త్వం కిమర్థం తప్యసే తపః | త్వయా శంభో%ధునా హ్యస్మిన్ గిరౌ హిమవతి ప్రభో || 14

ప్రకృత్యా గిలితో%సి త్వం న జానాసి నిజం హర | నిజం జానాసి చేదీశ కిమర్థం తప్యసే తపః || 15

వాగ్వాదేన చ కిం కార్యం మమ యోగింస్త్వయా సహ | ప్రత్యక్షే హ్యనుమానస్య న ప్రమాణం విదుర్బుధా ః || 16

ఇంద్రియాణాం గోచరత్వం యావద్భవతి దేహినామ్ | తావత్సర్వం విమంతవ్యం ప్రాకృతం జ్ఞానిభిర్ధియా || 17

నీవు ప్రకృతికి అతీతుడవైనచో, తపస్సును ఏల చేయుచున్నావు? హే శంభో! ప్రభో! నీవు ఇపుడు ఈ హిమవత్పర్వతముపై ఏలనున్నావు? (14). హే హరా! నీవు ప్రకృతినుండి విడి పోయినావు. నీ ఆత్మ స్వరూపమును నీవు తెలియకున్నావు. నీకు నీ ఆత్మ స్వరూపము విదితమే అయినచో, తపస్సునేల చేయుచున్నావు? (15) హే యోగీ! నాకు నీతో వాదులాడుటవలన ఏమి ప్రయోజనము గలదు? వస్తువు ప్రత్యక్షముగా నున్న సందర్భములో అనుమాన ప్రమాణమునకు తావు లేదని పండితులు చెప్పెదరు (16). ప్రాణులు తమ ఇంద్రియములచే ఎంతవరకు తెలుసుకొనగలరో, స్వీకరించగలరో, అది అంతయూ ప్రకృతి నుండియే ఉద్భవించినదని జ్ఞానులు తమ బుద్ధిలో దర్శించవలెను (17).

కిం బహూక్తేన యోగీశ శృణు మద్వచనం పరమ్ | సా చాహం పురుషో%సి త్వం సత్యం సత్యం న సంశయ ః ||18

మదనుగ్రహతస్త్వం హి సుగుణో రూపవాన్మతః | మాం వినా త్వం నిరీహో%సి న కించిత్ కర్తుమర్హసి || 19

పరాధీనస్సదా త్వం హి నానా కర్మ కరో వశీ| నిర్వికారీ కథం త్వం హిన లిప్తశ్చ మయా కథమ్ || 20

ప్రకృతేః పరమో%సి త్వం యది సత్యం వచస్తవ | తర్హి త్వయా న భేతవ్యం ససమీపే మమ శంకర || 21

ఓ యోగి వర్యా! ఇన్ని మాటలేల? నా శ్రేష్ఠమగు వచనమును వినుము. ఆ ప్రకృతి నేనే. నీవు పురుషుడవు. ఇది ముమ్మాటికీ సత్యము (18). నీవు నా అనుగ్రహము చేతనే రూపమును పొంది సగుణుడవైనా వని పెద్దలు చెప్పెదరు. నేను లేనిచో, నీయందు సంకల్పశక్తి ఉండదు. నీవు ఏ పనినీ చేయజాలవు (19). జీతేంద్రియుడవగు నీవు పరాప్రకృతికి అధీనుడవై వివిధ కర్మలననుష్ఠించుచున్నావు. నీవు వికారములు లేనివాడవు ఎట్లు కాగలవు? నా లేపము నీకు లేదనుట ఎట్లు సంభవము? (20) హే శంకరా! నీవు ప్రకృతి కంటె అతీతుడవు అనే నీమాట సత్యమైనచో, నీవు నా సమీపములో భయపడవలసిన పని యేమి? (21)

బ్రహ్మోవాచ|

ఇత్యాకర్ణ్య వచస్తస్యాః సాంఖ్యశాస్త్రోదితం శివః | వేదాంతమత సంస్థో హి వాక్యమూచే శివాం ప్రతి || 22

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఆమె సాంఖ్య శాస్త్రాను సారముగా పలికిన ఈ మాటలను విని శివుడు వేదాంత సిద్ధాంతము నాశ్రయించి శివా దేవితో నిట్లు పలికెను (22).

శ్రీ శివ ఉవాచ |

ఇత్యేవం త్వం యది బ్రూషే గిరిజే సాంఖ్యధారిణీ | ప్రత్యహం కురుమే సేవా మనిషిద్ధాం సుభాషిణి || 23

యద్యహం బ్రహ్మ నిర్లిప్తో మాయయా పరమేశ్వరః | వేదాంత వేద్యో మాయేశస్త్వం కరిష్యసి కిం తదా || 24

శ్రీ శివుడు ఇట్లు పలికెను-

ఓ పార్వతీ! నీవు సాంఖ్య సిద్ధాంతమునను సరించి ఇట్లు పలుకుచుంటివా? ఓ అందమైన పలుకులు గలదానా! అట్లైనచో, నీవు ప్రతి దినము నా సేవను చేయుము. నాకు నిషేధము లేదు (23). నేను మాయా లేపము లేని వాడను, పరమేశ్వరుడను, వేదాంతములచే తెలియదగు పరబ్రహ్మను, మాయను వశము చేసుకున్నవాడను అయినచో, అపుడు నీవేమి చేయగలవు? (24)

బ్రహ్మోవాచ|

ఇత్యేవముక్త్వా గిరిజాం వాక్యముచే గిరిం ప్రభుః | భక్తానురంజనకరో భక్తాను గ్రహకారకః || 25

బ్రహ్మ ఇట్లు పలికెను-

భక్తులను రంజింపజేసి, అనుగ్రహించు ఆ ప్రభుడు పార్వతితో నిట్లు పలికి, తరువాత హిమవంతునితో నిట్లనెను (25).

శివ ఉవాచ|

అత్రైవ సో%హంతపసా పరేణ గిరే తవ ప్రస్థవరే%తి రమ్యే |

చరామి భూమౌ పరమార్థ భావ స్వరూపమానందమయం సులోచయన్ || 26

తపస్తప్తు మనుజ్ఞా మే దాతవ్యా పర్వతాధిప | అనుజ్ఞయా వినా కించిత్తపః కర్తుం న శక్యతే || 27

శివుడిట్లు పలికెను-

ఓ పర్వత రాజా! నేను ఇచట నీ ఈ అతి సుందర పీఠ భూమి యందు మహా తపస్సును చేసెదను. అనందఘనము, పరమతత్త్వము, సద్ఘనమునగు ఆత్మ స్వరూపమును దర్శించుచూ ఈ

భూమి యందు సంచరించెదను (26). ఓ పర్వతరాజా! నేను ఇచట తపస్సును చేసుకొనుటకు అనుజ్ఞనిమ్ము అనుజ్ఞ లేకుండగా నీ ఈ స్థానమునందు ఏ విధమైన తపస్సునైననూ చేయుట సంభవము కాదు (27).

బ్రహ్మోవాచ|

ఏతచ్ఛ్రుత్వా వచస్తస్య దేవ దేవస్య శూలినః | ప్రణమ్య హిమవాన్ శంభు మిదం వచనమబ్రవీత్ || 28

బ్రహ్మ ఇట్లు పలికెను-

దేవదేవుడు, త్రిశూలధారి యగు ఆ శివుని ఈ వచనమును విని, హిమవంతుడు శివునకు నమస్కరించి ఇట్లు పలికెను (28).

హిమవానువాచ |

త్వదీయం హి జగత్సర్వం సదేవాసురమానుషమ్ | కిమప్యహం మహాదేవ తుచ్ఛో భూత్వా వదామితే || 29

హిమవంతుడిట్లునెను-

దేవతలు, రాక్షసులు, మనుష్యులతో గూడిన జగత్తు అంతయూ నీదే. హే మహాదేవా! నేను అత్యల్పుడను. నీతో నేనేమి చెప్పగలను? (29)

బ్రహ్మోవాచ|

ఏవముక్తో హిమవతా శంకరో లోకశంకరః | విహస్య గిరిరాజం తం ప్రాహ యాహీతి సాదరమ్ || 30

శంకరేణా భ్యనుజ్ఞాతస్స్వ గృహం హిమవాన్ య¸° | సార్ధం గిరిజయావై స ప్రత్యహం దర్శనే స్థితః || 31

పిత్రా వినాపి సా కాలీ సఖీభ్యాం సహ నిత్యశః | జగామ శంకరాభ్యాశం సేవాయై భక్తి తత్పరా || 32

నిషిషేధ న తాం కోऽపి గణో నందీశ్వరాదికః | మహేశశాసనాత్తాత తచ్ఛాసనకరశ్శుచిః || 33

బ్రహ్మ ఇట్లు పలికెను-

హిమవంతుడిట్లు పలుకగా, లోకములకు మంగళమునిచ్చే శంకరుడు నవ్వి హిమవంతునితో సాదరముగా 'నీవు వెళ్లుము' అని చెప్పెను (30). హిమవంతుడు శంకరుని అనుమతిని పొంది తన ఇంటికి వెళ్లెను. ఆయన ప్రతిదినము పార్వతితో గూడి శంకరుని దర్శించుచుండెను (31). భక్తి తత్పరురాలగు ఆ కాళి ప్రతి దినము తండ్రి రాకపోయిననూ, ఇద్దరు చెలికత్తెలతో గూడి సేవకొరకై శంకరుని సమీపమునకు వెళ్లుచుండెను (32). వత్సా! మహేశుని ఆజ్ఞను పాలించే పవిత్ర హృదయుడగు నందీశ్వరుడు, ఇతర గణములు శివుని ఆజ్ఞచే ఆమెను వారించలేదు (33).

సాంఖ్య వేదాంత మతయో శ్శివయోశ్శివదస్సదా |
సంవాదస్సుఖకృచ్చోక్తోऽభిన్నయోస్సవిచారతః || 34

గిరిరాజస్య వచనాత్తనయాం తస్య శంకరః | పార్శ్వే సమీపే జగ్రాహ గౌరవాదపి గోపరః || 35

ఉవాచేదం వచః కాలీం సఖీభ్యాం సమ గోపతిః | నిత్యం మా సేవతాం యాతు నిర్భీతా హ్యత్ర తిష్ఠతు || 36

ఏవముక్త్వాతు తాం దేవీం సేవాయై జగృహే హరః | నిర్వికారో మహాయోగీ నానాలీలా కరః ప్రభుః || 37

జాగ్రత్తగా పరిశీలించినచో శివాశివుల మధ్య భేదమే లేదు. అట్టి వారిద్దరు క్రమముగా సాంఖ్యవేదాంత మతములననుసరించి చేసిన సుఖకరమగు సంవాదమును వివరించితిని. ఈ సంవాదము సర్వదా మంగళములను కలిగించును (34). జితేంద్రియుడగు శంకరుడు పర్వతరాజు నందు గల గౌరవముచే ఆతని మాట ప్రకారంగా ఆతని కుమార్తెను తన వద్దకు వచ్చుటకు అంగీకరించెను (35).

జితేంద్రియుడగు శివుడిట్లు పలికెను. ఈ కాళి సఖురాండ్రిద్దరితోగూడి ప్రతిదినము నన్ను సేవించి వెళ్లవచ్చును. మరియు ఇచట నిర్భయముగా నుండవచ్చును (36). ఇట్లు పలికి, వికారములు లేనివాడు, మహాయోగీశ్వరుడు, అనేక లీలలను ప్రదర్శించువాడునగు శివ ప్రభుడుఆ దేవిని సేవకొరకై స్వీకరించెను (37).

ఇదమేవ మహదైశ్వర్యం ధీరాణాం సుతపస్వినామ్ | విఘ్నవంత్యపి సంప్రాప్య యద్విఘ్నైర్న విహన్యతే || 38

తతః స్స్వపురమాయాతో గిరిరాట్ పరిచారకైః | ముమోదాతీవ మనసి సప్రియస్స మునీశ్వర || 39

హరశ్చ ధ్యానయోగేన పరమాత్మనమాదరాత్ | నిర్విఘ్నేన స్వమనసా త్వాసీ చ్చింతయితుం స్థితా || 40

కాలీ సఖీభ్యాం సహితా ప్రత్యహం చంద్రశేఖరమ్ | సేవమానా మహాదేవం గమనాగమనే స్థితా || 41

ప్రక్షాళ్య చరణౌ శంభోః పపౌ తచ్చరణోదకమ్ | వహ్నౌ శౌచేన వస్త్రేణ చక్రే తద్గాత్రమార్జనమ్ || 42

ధీరులగు తపశ్శాలురకు విఘ్నములు వచ్చుచుండును. కాని అవి వారి తపస్సును భంగము చేయజాలవు. అదియే వారికి గల గొప్ప ఐశ్వర్యము (సామర్థ్యము) (38). ఓ మహర్షీ ! అపుడు పర్వతరాజు సేవకులతో గూడి తన పురమునకు మరలివచ్చెను. ఆతడు మనస్సులో గొప్ప ఆనందమును పొందెను (39). శివుడున్నా విఘ్నముల పీడలేని తన మనస్సుతో ధ్యానయోగము నభ్యసించుచూ, ఆత్మ రూపమును ధ్యానించుచుండెను (40). కాళీ దేవి సఖురాండ్రిద్దరితో గూడి ప్రతిదినము అచటకు వచ్చి చంద్ర భూషణుడగు మహాదేవుని సేవించి మరలు చుండెను (41). ఆమె

శంభుని పాదములను కడిగి ఆ పాదోదకమును త్రాగెడిది. మరిగించిన నీటిలో శుభ్రము చేయబడిన వస్త్రముతో శివుని శరీరమును తుడిచెడిది (42).

షోడశేనోపచారేణ సంపూజ్య విధి వద్ధరమ్ | పునః పునస్సుప్రణమ్య య్ ౸ ° నిత్యం పితుర్గృహమ్ || 43

ఏవం సంసేవమానాయాం శంకరం ధ్యానతత్పరమ్ | వ్యతీయాయ మహాన్ కాల శ్శివాయా మునిసత్తమ || 44

కదాచిత్సహితా కాలీ సఖీభ్యాం శంకరాశ్రమే | వితేనే సుందరం గానం సుతాలం స్మరవర్ధనమ్ || 45

కదాచిత్కుశపుష్పాణి సమిధం నయతి స్వయమ్ | సఖీభ్యాం స్థానసంస్కారం కుర్వతీ న్యావసత్తదా || 46

ఆమె ప్రతి దినము శివుని యథావిధిగా షోడశోపచారములతో పూజించి, మరల మరల నమస్కరించి తండ్రి గృహమునకు మరలుచుండెడిది (43). ఓ మహర్షీ! ఇట్లు ఆ శివాదేవి ధ్యాననిమగ్నుడైన శంకరుని సేవించుచుండగా చాల కాలము గడిచిపోయెను (44). ఒకప్పుడు ఆ కాళి సఖురాండ్రిద్దరితో గూడి శంకరుని ఆశ్రమములో కామ వర్ధకము, మంచి తాళము గలది అగు మధురమైన పాటను పాడెను (45). మరియొకప్పుడు ఆమె దర్భలను, పుష్పములను, సమిధలను స్వయముగా తెచ్చెడిది. ఆమె అక్కడ స్థలము నంతనూ సఖురాండ్రతో గూడి శుభ్రము చేయుచుండెడిది (46).

కదాచిన్నియతా గేహే స్థితా చంద్రభృతో భృశమ్ | వీక్షన్తీ విస్మయామాస సకామా చంద్రశేఖరమ్ || 47

తతస్తప్తేన భూతేశస్తాం నిస్సంగాం పరిస్థితామ్ | సో%చింతయత్తదా వీక్ష్య భూతదేహే స్థితేతి చ || 48

నాగ్రహీద్గిరిశః కాలీం భార్యర్థే నికటే స్థితామ్ | మహాలావణ్య మునీనామపి మోహినీమ్ || 49

మహాదేవః పునర్దృష్ట్వా తథా తాం సంయతేంద్రియామ్ | స్వసేవనే రతాం నిత్యం సదయస్సమచింతయత్ || 50

ఒకప్పుడామె అనురాగముతో కూడినదై చంద్రశేఖరుని కుటీరములో ఆయన సమీపములో గూర్చుండి ఆయనను ఆశ్చర్యముతో చూచుచుండెడిది (47). భూతపతియగు ఆ శివుడు విషయాసంగములేనిదై తన సమీపములోనున్న ఆమెను చూచి, పూర్వము సతీరూపములో నున్న దేవియే ఈమె యని తపః ప్రభావముచే మనస్సుతో దర్శించెను (48). శివుడు తన సమీపమునందున్నట్టియు, మహాలావణ్యదనిధియైనట్టియు, మహర్షులకు కూడ మోహమును కలిగించగల ఆ కాళీ దేవిని వెంటనే భార్యగా స్వీకరించలేదు (49). ఇంద్రియ జయము కలిగి నిత్యము నిష్ఠతో తనను సేవించుచున్న ఆమెను అనేక పర్యాయములు చూచిన పిదప మహాదేవునకు దయ కలిగి ఇట్లు తలపోసెను (50).

యద్వైవైషా తపశ్చర్యావ్రతం కాలీ కరష్యతి | తదా చ తాం గ్రహీష్యామి గర్వబీజ వివర్జితామ్ || 51

ఈ కాళి ఎప్పుడైతే తపస్సును తీవ్రముగా చేయునో, అప్పుడు ఆమెలోని గర్వము యొక్క బీజము తొలగిపోవును. అపుడామెను నేను స్వీకరించగలను (51).

బ్రహ్మోవాచ|

ఇతి సంచింత్య భూతేశో ద్రుతం ధ్యానసమాశ్రితః | మహాయోగీశ్వరో%భూద్వై మహాలీలాకరః ప్రభుః || 52

ధ్యానాసక్తస్య తస్యాథ శివస్య పరమాత్మనః | హృది నాసీన్మనే కాచి దన్యా చింతా వ్యవస్థితా || 53

కాలీ త్వనుదినం శంభుం సద్భక్త్యా సమసేవత | విచింతయంతీ సతతం తస్య రూపం మహాత్మనః || 54

హరో ధ్యానపరః కాలీం నిత్యం పై#్రక్షత సుస్థితామ్ | విస్మృత్య పూర్వచింతాం తాం పశ్యన్నపి న పశ్యతి || 55

ఏతస్మిన్నంతరే దేవాశ్శక్రాద్యా మునయశ్చ తే| బ్రహ్మాజ్ఞయా స్మరం తత్ర ప్రేషయామాసురాదరాత్ || 56

బ్రహ్మ ఇట్లు పలికెను-

భూపతి, మహాయోగిశ్రేష్ఠుడు, గొప్ప లీలలను ప్రదర్శించువాడునగు ఆ ప్రభువు ఇట్లు తలపోసి వెంటనే ధ్యాననిమగ్నుడయ్యెను. (52). ధ్యానమునందు నిమగ్నుడైన ఆ శివపరమాత్మ యొక్క హృదయములో మరియొక తలంపు లేకుండెను. ఓమహర్షీ! (53) కాళీదేవి సర్వకాలములయందు ఆ మహాత్ముని రూపమును స్మరింస్తూ, ప్రతి దినము ఆ శంభుని మంచి భక్తితో చక్కగా సేవించెను(54). శివుడు నిత్యము ఆ సుందరిని చూచుచూ, పూర్వమందలి దుఃఖమును మరచిపోయెను. ధ్యాన నిమగ్నుడైన ఆ శివుడు ఆమెను చూచుచున్ననూ చూడని వాడు వలెనే యుండెను. (55). ఇంతలో ఇంద్రుడు మొదలగు దేవతలు, మరియు మునులు బ్రహ్మ యొక్కఆజ్ఞను ఆదరముతో స్వీకరించి మన్మథుడు అచటకు పంపింరి(56).

మునులు బ్రహ్మ యొక్క ఆజ్ఞను ఆదరముతో స్వీకరించి మన్మథుని అచటకు పంపిరి(57).

తేన కారయితుం యోగం కాల్యా రుద్రేణ కామతః |మహావీర్యేణాసురేణ తారకేణ ప్రపీడితాః|| 57

గత్వా తత్ర స్మరస్సర్వ ముపాయమకరోన్నిజమ్ | చుక్షుభే నహరః కించిత్తం చ భస్మీ చకార హ || 58

పార్వత్యపి విగర్వా భూన్మనే తస్య నిదేశతః | తతస్తపో మహత్ కృత్వా శివం ప్రాప పతిం సతీ|| 59

బభూవతుస్తౌ సుప్రీతా పార్వతీపరమేశ్వరౌ | చక్రతుర్దేవ కార్యం హి పరోపకరణ రతౌ|| 60

ఇతి శ్రీ శివ మహాపురాణ రుద్ర సంహితాయాం పార్వతీ ఖండే పరమేశ్వర సంవాద వర్ణనం నామ త్రయోదశో%ధ్యాయః(13)

మహాబలవంతుడగు తారకాసురునిచే మిక్కిలి పీడించబడిన దేవతలు రుద్రుడు కాళిని ప్రేమించి వివాహమాడునట్లు చేయుటకై మన్మథుని పంపిరి(57). మన్మథుడు అచటకు వెళ్లి తన ఉపాయములనన్నిచినీ ప్రయోగించెను. శివుడు లేశ##మైననూ చలించలేదు. పైగా అతనిని బూడిదగా చేసెను.(58) ఓ మహర్షి!పార్వతి కూడా తన గర్వమును విడనాడెను. ఆ సతి శివుని ఆదేశముచే గొప్ప తపస్సును చేసి శివుని భర్తగా పొందెను. (59) ఆ పార్వతీ పరమేశ్వరులు మిక్కిలి ఆనందించిరి. ఇతరులకు ఉపకరించుటలో ప్రీతి గల ఆ దంపతులు దేవ కార్యమును నెరవేర్చిరి(60).

శ్రీ శివ మహాపురాణములో రుద్ర సంహితయందు పార్వతీ ఖండలో పార్వతీ పరమేశ్వ సంవాద వర్ణన మనే పదమూడవ అధ్యాయము ముగిసినది(13).